శ్రీనవాంధ్ర గ్రంథమాల
రాజమహేంద్రి

ప్రహసన గుచ్ఛము
మూడవ కుసుమము



# పిసినిగొట్టు



శ్రీపాద కామేశ్వరరావు



దీని వెల 0—4—0

# పసినిగొట్టు

వంగభాషలోని పునర్జన్మమునకు తెలుగు


గ్రంథకర్త:

శ్రీపాద కామేశ్వరరావు





ప్రకాశకుడు

చెలికువాడ వేంకటరామయ్య

అభినవాంధ్ర గ్రంథమాలా కార్యాలయము

రాజమంద్రి



సర్వస్వామ్య సంకలితము



1927

వెల 8 అణాలు

# పీఠిక

ఒక జ్యోతిష్కుడు బ్రతికియుండగానే-వాని శవమును సమాధిచేసినట్లు డీఫో అనే ఆంగ్లకవి కథ కల్పించెను. దైవజ్ఞుడేమీ తోచక తాను బ్రతికియున్నట్లు సిద్ధాంతముచేయుమని ప్లీడరును పెట్టెనే కాని వారు తగిన ప్రమాణములు చూపలేక పోయినట్లు కథను ముగించెను.

దీని ననుసరించి కీర్తిశేషులయిన ద్విజేంద్రలాల్ రాయలు "పునర్జన్మ" మనే ప్రహసనము రచించెను. దానిని శ్రీయుత రూపనారాయణ పాండేయగారు హిందీభాషలోకి తర్జుమా చేసినారు. దీనిని తెలిగించి మేమాంధ్రలోకమునకు సమర్పిస్తూన్నాము.

హిందీ గ్రంథరత్నాకర గ్రంథమాలవారి కనేక వందనములు.

రాజమండ్రి
5—11—27

విధేయుడు
చెఱకువాడ వేంకటరామయ్య

## పాత్రములు

ధనాల పోలిసెట్టి ... ... ... గొప్ప ధనికుడు

వరాల వీరిసెట్టి ... ... ... పోలిసెట్టి బావ

నందకుమారుడు
జగన్మోహనుడు
రామచంద్రుడు
సుందరము
} వీరిసెట్టి మిత్రులు

దుకాణదారులు ... ... ... ఆరుగురు

చుట్టుప్రక్కల గృహస్థులు ... ... ఐదుగురు

ఇతరులు ... ... ... ఐదుగురు

పుల్లయ్య
సరయ్య
} పోలిసెట్టి పుత్రులు.

విలాసపురుషులు ... ... ... ఐదుగురు

పోలీసువారు—ఇనస్పెక్టరు, హెడ్డుకాన్‌స్టేబిలు, ఇతరజవానులు.

### స్త్రీలు.

1. సుశీల ... ... ... పోలిసెట్టి భార్య
2. సరళ ... ... ... కూతురు.




# మొదటి అంకము

## మొదటి రంగము

——:o:——

ధనాల పోలిశెట్టి యిల్లు-సామాను చెదరియుండును.

వీరిశెట్టియు సుశీలయు ప్రవేశింతురు.

వీరి—ఈవాళే వైశాఖ శుద చవితి. ఇదివరకే అందరితో చెప్పి వుంచాను.

సుశీ—దీని కంతటికీ ఫల మేమవునా అని ఆలోచిస్తున్నాను.

వీరి—ఫలవాఁ? ఇంకేమి కాకున్నా అతడి ప్రాణం నిలుస్తుంది. అతడి దగ్గిర అప్పుచేసినవాళ్ళందరూ అతన్ని చంపాలనుకోవడము నువ్వు విన్నావా? సమయం దొరకడవేఁ తడవు. అంతాసిద్ధంచేశారు.

సుశీ—అన్నా, తెలియక అడుగుతాను. ఆయనవల్ల నేర మేఁవిఁటి? వడ్డీకోసమే కదా అప్పివ్వడము?-వడ్డీ పుచ్చుకోక ఊరుకుంటారా?

వీరి—కూటికి గుడ్డకి చాలనివాళ్ల ఇల్లూవాకలీ అమ్మించడమా వడ్డీవర్తకము? కాదు, కాదు. పట్టపగలు బుర్రలు బద్దలుగొట్టడమను. ప్రొద్దున్నే వాడి పేరు తల్చుకుంటే ఆరోజు అన్నం దొరకదు. ఏదైనా పని చేసినప్పుడు వాడి మొఖం చూస్తే అది ధ్వంసమేఁ కదా? ఎంతమందో వాడికి మృతి రాకపోయింది కదా అని రాత్రీ పగలూ ఘోషిస్తున్నారు. ఇదంతా సుఖ మనుకుంటావా?

సుశీ—నువ్వు వేసిన పతకం బాగావుంది. అవ్వా బువ్వా కూడా దొరుకుతాయి—గురి తప్పిపోదు కదా?

వీరి—తప్పడమేఁ? పిచ్చి ముండాకొడుకు జోతిషం అంటే పడి చస్తాడు-వైశాఖ శుద్ధ చవితినాడు రెండుఝాముఁలకి వాడింట్లో పాము కరిచి చస్తాడని మారకం రాశారట జాతకంలో, అది వేదవాక్యం అనుకుంటున్నాడు.

సుశీ—ఇప్పు డాయ నేఁడీ?

వీరి—గండం తప్పించుకోవడానికి కాబోలు గోదారిలో మెడబంటి నీళ్ళలో నిల్చున్నాడు, అలాగైతే తన యింట్లో మారకం తప్పుతుంది కదా అని అతని ఊహ.

సుశీ—(నవ్వి) బాగు! బాగు!

వీరి—ఈవాళ మంచి గమ్మత్తవుతుంది,చూస్తూండు.

సుశీ—నిజవేఁ, మంచి వినోదవేఁ. ఇంకా రాలేదే?

వీరి—వొస్తూవుంటూ డీపాటి-మధ్యాహ్నం దాటిం దిగా...సరేగాని-నువ్వేవేఁవిఁ చెయ్యాలో యాది ఉందా?

సుశీ—అంతా జ్ఞాపకం వుంది.

వీరి—సరే-ఇక నింట్లోకి వెళ్ళు.

సుశీ—మంచి వినోదవేఁ! ఇంకాలస్య మేల? (వెళ్లును)

వీరి—పోలిసెట్టి ముందు జన్మాన అఖండతపస్సు జేశాడు కాబోలు; లేకుంటే సార్థకనామధేయ అయిన ఈమె వంటి పెండ్లాము దొరుకుతుందా? ఈ దౌర్భాగ్యుడు దాచి పెట్టిన ద్రవ్యంలో వీణ్ణి పాతిపెట్టొచ్చు; అయినా ఆలికి కడుపు నిండా కూడు లేదు, ఒంటినిండా గుడ్డలేదు. పాపం అమాయి కురాలు గనక ఎప్పుడూ నవ్వుతునే ఉంటుంది...పిసినిగొట్టు పీనుగ కీవాళ బుద్ధి చెప్పాలి; విన్నవాళ్లంతా పట్టరాని నవ్వు తో పడి దొర్లాలి. పిసినిగొట్టులకి వీడు పెద్ద. వయసు తీరిన తర్వాతవీడికి పెళ్లా? ...అందులోనూ—వీడుకురూపి, పరమ మూర్ఖుడు; ఆమె చక్కని చుక్క—చదువుకొన్నది—ఏమి దాంపత్యము కదా!...మూర్ఖుడు కాకపోతే జాతకమంటే పడి చస్తాడా! రానీరానీ.

(నందకుమారుడు మొదలగు నలుగురు మిత్రులు వత్తురు)

వీరి—వచ్చారా? వేళకే వచ్చారు—పోలిసెట్టీ వస్తూ ఉంటాడు.

జగ—అంతా సిద్ధంగా వుందా?

వీరి—అహా! సర్వం సిద్ధమే—పోలిశెట్టి కొడుకులకి మాత్రం యింకా చెప్పలేదు. మూడు రోజులాయి వాళ్లింటికి రానే లేదు. డబ్బు దండు గౌతుందని ఈ దుర్మార్గుడు వాళ్లని బర్లో వెయ్యడు. ఇఖ వాళ్లు పాడుగాక మరే వొం తాదు? వాళ్లిద్ద రెందుకూ కొరగారు.

జగ—అలాగనా?

వీరి—మనపని కడ్డులేదు. చెప్తే వినేవారే—ముసలి వా డెప్పుడు హరీ అంటాడా అని చూస్తున్నారు. తండ్రి చచ్చిన తర్వాత తనయు లేంచేస్తారో ఈ దరిద్రు డిప్పుడే చూడగలడు...అదిగో వస్తూ ఉన్నాడు. రామచంద్రం, పడుకో! పడుకో! ఒచ్చాడు, ఒచ్చాడు...(అతడు పండు కొనును)

వీరి—మీరందరూ మంచం చుట్టూ కూర్చోండి. (రామచంద్రునిపై గుడ్డ వేయును) ఇదిగో మీరందరు విచారంగా ఉన్నట్టు కూర్చోవాలి—రామచంద్రం, కదల కూడదు, మెదల కూడదు; శవం లాగు పడుకో...సై, ఆఁ!

అందరు—సైఁ సైఁ.

వీరి—ఇదుగో నేనుపోయి సరిగా సమయానికి వస్తాను. అందరూ ఏడుపు మొగాలు వేయండి. (వెళ్లును)

———

## రెండో రంగము

——( :o: )——

(పోలి శెట్టి వచ్చును)

పోలి—అమ్మయ్యా! ఇక ప్రాణానికి ఫర్వా లేదు. జాతకంలో మాటలు కూడా ఒక్కొక్కప్పుడు అబద్ధా లవుతూ ఉంటాయి. రెండు జాముల కి సరిగ్గా ప్రాణం పోతుం దను కొన్నాను. ఆ వేళ దాటింది—ఇక పర్వా లేదు.

జగ—అయ్యో! అయ్యో! పాపం పరలోక ప్రాప్తి చెందాడు.

నంద—సరిగ్గా రెండు జాముల కే—

సుంద—పా మెక్కడనుంచి వచ్చిందో?-కాటు వేసి మాయం అయిపోయింది.

పోలి—ఎవరు చెప్మా చచ్చిపోయినారు?

జగ—ధాత రాసిన రాత—

నంద—నుదుటను వ్రాసిన వ్రాలుకన్న గలదా నూ రే ళ్లు చింతించినన్?

పోలి—ఎవరయ్యా చనిపోయినది?

నంద—పాపం కొడుకు లింకా రాలేదూ?

జగ—చాలా సేపు చూచాం.

సుంద—ఇంకా కని పెట్టుకొందామా, శవాన్ని మెల్లిగా శ్మశానానికి చేరుద్దామా? అక్కడికే రమ్మనొచ్చు వాళ్లని—

పోలి—ఎవరి శవా న్నయ్యా స్మశానంకి చేరుస్తారు?

జగ__అయ్యో! పోలిశెట్టి గారిది__

నంద__చివరికీ__

సుంద__కాలం చేశాడు.

పోలి__ఏవిఁటీ! పోలిసెట్టి చచ్చిపోయినాడా? ఏ పోలి శెట్టి?

జగ__ఏమి ఇల్లు! ఏవిఁ వాకలి!__

నంద__మొన్ననే గదా రెండో వివాహం అయింది. అయ్యో ఎంత చక్కని చుక్క!

సుంద__అయ్యయ్యో! ఇంతలోనే కాలంమూడింది!

పోలి__ఎవరి కయ్యా కాలం మూడింది?

జగ__అయ్యా—ఈ యింటి యజమాని పోలిసెట్టికి—

పోలి__(కోపముతో) పోలిసెట్టి కెక్కడ కాలం మూడింది? మీకు మతి పోయింది!

నంద__ఎందుకు మూడిందో మేమెఱగం గాని కాలం మూడిన మాట నిజం—ప్రాణం పోయింది.

అందరు__అయ్యో! అయ్యో! ఎంత పనైంది!

పోలి__మీ రలా గంటున్నారేవిఁ? నేను స్వయంగా మీయెదుట ప్రత్యక్షంగా నిలబడుతూంటే.

జగ__అయ్యా! మీ రెవరండీ?

పోలి__నేనే పోలిశెట్టిని. కళ్లు గుపడవా?

నంద__ఏవిఁటీ-ఏవిఁటీ?

జగ__ఇది బాగా వుంది!

నంద—ఎవ రన్నారురా నువ్వు పోలిశెట్టి వనీ?

పోలి—మీకు పిచ్చెత్తిందా ఏవిఁ? నేను పోలిశెట్టి నని మీకళ్లు చెప్పలేదూ?

జగ—అయ్యా! తమరు దయచేయండి. శోకసమయాన వేళాకోళం చెయ్యకూడదు. ఈపాటి తెలియదా?

నంద—గవఁళ్ల గంగమ్మ ప్రసాదం పుచ్చుకొన్నారా ఏవిఁ?

జగ—లేక జ్ఞానపత్రి సేవించారా?

సుంద—ఇక్కడ్నుంచి పోవయ్యా!

పోలి—అన్నా! ప్రమాదం సంభవించిందే! మీకందరికీ వెర్రెత్తిందా ఏవిఁ? నేనే పోలిశెట్టిని—మీా క్కనబడలేదూ?

జగ—అలాగా? ఏదీ చూతాం రండోయి!

(అనేక విధముల పరీక్షచేసి)

నంద—అయ్యా! చూడ్డానికి శెట్టి పోలికలు కొన్నున్నాయి!

సుంద—వేషం సరిగ్గానే వుంది!

జగ—చాలా బాగా వుంది!

పోలి—వేష వేఁవిఁటీ?

జగ—బాగానే అవిఁరింది; కాని ముక్కుమాత్రం సరిపోలేదు.

పోలి—సరిగ్గా లేదేం? బాగా చూడు.

నంద__రంగు మట్టుకు బాగానే సరిపెట్టావు.

పోలి__సరిపెట్టడ మేమిటి నీ మొఖం.

సుంద__పిలక కూడా ఉంచావే? వాహ్వా! వాహ్వా!

జగ__ముక్కులో తేడా లేకపోలేదు.

నంద__నిజమే సుమా! ఈ ముక్కు__

పోలి__ముక్కు కేమీ?

జగ__ఏమీ లేదు_సరిగ్గా అమరలేదు.

నంద__అబ్బే! లేదు లేదు.

సుంద__అప్పుపుచ్చుకొన్న వాళ్ళని బుట్టలో వేయ లేవు లే.

పోలి__అయితే నేను పోలిశెట్టిని కానంటారా ఏమి?

జగ__అన్నా! నీ సాహసానికి సంతసించ వలసిందే_ అతని మాటలు కూడా నీకు పట్టుబడి నట్లుంది?

నంద__సరిగ్గా_ఆ మాటలే_ తేడా లేదు.

సుంద__పోలిక తప్ప లేదు సుమా.

జగ__శాబాస్...అతని రెండో భార్య...

జగ__బాగా చదువుకున్నదీ_ తెలివైనదీ__

నంద__పడుచుదీ__

పోలి__పడుచుదో, ముసలిదో నీ కెందు కాగోల అదీ నా భార్య, నీ భార్య కాదే?

అందరు__(నవ్వుదురు)

జగ__ఋణస్థులను బుట్టలో వెయ్యడమే కాక ఇం

పెద్ద ఆలోచన చేశావే!

నంద—భార్యను కూడా చేజిక్కించుకోవాలనుకొన్నావా?

సుంద—అబ్బో! మంచి యెత్తే.

పోలి—మీారూ—ఎవరురా? మీారు.

(ఋణస్థులు వత్తురు)

1 దుకా—ఏమయ్యా! పోలిశెట్టిగారు పరంపదంకి వేంచేశారా?

జగ—ఔనండి—ఇదుగో శవాన్ని శ్మశానికి తీసుకొని పోతాం.

2 దుకా—ఇతడేనా అతడు?

3 దుకా—శెట్టి వేషం వేసినాయన ఇతగాడేనా?

పోలి—వేషం వేసుకొని వచ్చానేమిఁ?

సుంద—ఔను—ఇతనే నండి.

4 దుకా—ఇతనెవడో గజదొంగ లాగున్నాడు.

పోలి—గజదొంగా! నా యిట్లోంచి పొండి.

5 దుకా—నువ్వు ముందర నడూ.

పోలి—ఈయిల్లు నాది.

2 దుకా—అబ్బో! మమ్మల్ని బుట్టలో వేయడానికా వచ్చావు? నూకన్ను కప్పలేవు, తెలిశిందా?

4 దుకా—నీకొక టోలీ యివ్వమూ.

పోలి—దావా చేస్తే అంతా యివ్వక తప్పదూ.

3 దుకా—దావా చేస్తావేం? అబ్బా! ఏమిఁ గుండె ధిట్టం?

5 దుకా—నిన్నిప్పుడు పోలీసువాళ్ళ కప్పగిస్తాను చూడు.

3 దుకా—పిలువురా ఇనస్పెక్టరు గార్ని—

4 దుకా—ఇదుగో నీగుట్టు బైట పెడతాం చూడు.

2 దుకా—వెళ్ళరా! పోలీసు వ్వాళ్ళని తీసుకొనిరా!

(1 దుకా—వెళ్ళును)

జగ—సుందరం, శవాన్ని పట్టుకొని నడుద్దాం, ఎంత సేపు కనిపెట్టుకోవడం?

సుంద—ఎత్తం డెత్తండి-(ఎత్తి) గోవిందా, గోవింద—

పోలి—ఏ డ్రైవరిశవాన్ని తీసుకోపోతున్నారు? పోలి శెట్టిదా?ఐతే నే నెవణ్ణి?

2 దుకా—దగాఖోర్!

పోలి—ఇదుగో, మాటలు మాత్రం సరిగ్గారానీ-తిట్టే ఒప్పుకొనేవాణ్ణి కాను, చెప్తున్నాను.

3 దుకా—వేషం మాత్రం సరిపెట్టావులే.

పోలి—మంచిపని చేశాను. ను వ్వెవడ వడగడానికి?

4 దుకా—తన్నురా-గాడిదె కొడుకునీ—

పోలి—ఇదుగో-మాటలు మాత్రం తిన్నగా రానీ అబ్బాయి.

అంద—నో ర్మూసుకో!

(అందరు తన్నుదురు.)

పోలి—అయ్యో! అమ్మయ్యో! ఎవరండో పోలీ పోరూ! వీరయ్య! వీరయ్యా! (పోలిశెట్టి కూతురు, రెండో వైపునుండి వీరిశెట్టియు వత్తురు.)

వీరి—ఏవిఁ! ఏవిఁ! ఏవిఁటీ గోల? ఈ గొల్లంతూ?

పోలి—వొచ్చావ్రా! బావా చూడు, వీళ్ళంతా నన్ను కుళ్ళ బొడుస్తున్నారు.

అంద—నోరు మూయి.

వీరి—సంగ తేవిఁటి? చెప్ప రేవిఁ?

2 దుకా—ఏవీఁ లేదండీ. పోలిశెట్టేమో కాలం చేశాడు.

3 దుకా—ఆమాట వినే మే మొచ్చాము.

4 దుకా—మధ్య ఈపాజీ పోలిశెట్టి వేషము వేసుకొని ఎక్కణ్ణుంచో ఉట్టి పడ్డాడు.

పోలి—అయ్యా-నేనే పోలిశెట్టి—

అందరు—నోర్మూయి.

వీరి—ఆహా! గోల చేస్తా వెందుకయ్యా? నేనంతా పైసలు చేస్తాను ఊరుకో—పోలిశెట్టి కాలంచేశాడా?

2 దుకా—ఔనండయ్యా.

వీరి—ఆమాట నేను వినలేదే!—అలాగు జరిగుండదే?

పోలి—చూడండయ్యా... నేను బ్రతికుంటే—

అంద—నోర్మూయి—

వీరి—అదేవిఁటాగందరగోళం—పోలిశెట్టి నిజంగా చనిపోయినట్టు మీా కెరుగుదురా?

3 దుకా—ఔనండీ—ఇప్పుడిప్పుడే—మీారు క్షణంలో వస్తారనగా అతని శవాన్ని స్మశానానికి తీసుకొనిపోయినారు.

వీరి—ఎప్పుడూ?

4 దుకా—ఇవాళ రెండు ఝాములకండి.

వీరి—ఎందుచేత మరణించాడు?

2 దుకా—పాము కరిచీ—

వీరి—పట్టపగలు, మట్టమధ్యాహ్నం పాము కరవడ వేఁవిఁటి? ఇది అసంగతం.

పోలి—చూశావా; బావా—ఎంత దుర్మార్గులోఁ, నేను బతికుండగానే...

అంద—నోర్ముయి.

వీరి—రెండుఝాములకి పాము కరవడ వేఁవిటి? మనిషి చావడ వేవిఁటి? నే న్నమ్మను.

2 దుకా—అలాగు జాతకంలో వుంటే నమ్మకపోవడ వేఁవిటి? "నుదుటన్ వ్రాసిన వ్రాలుకన్న గలదా నూరేళ్ళు చింతించినన్" అన్నాడు. అలాగు మృత్యువని అతని నొసట రాసిఉంటే తప్పుతుందా?

వీరి—ఏదీ? జాతకం తెప్పించి చూదాం. అమ్మా నువ్వెళ్ళి మీానాన్న జాతకం తీసుకొ్రా. (సరళ పోవును) ఏమయ్యా! జాతకంలో రాశున్నదా?—నీ వెరుగుదువా?

4 దుకా__ఆహా! నేనెరుగుదు.

3 దుకా__మేమంతా అబద్ధ మాడుతున్నావనేనా మీా ఊహ?

పోలి__నేను బతికుంటేనే!

వీరి__అయ్యా, ఉండండి-జాతకం చూస్తే సంశయమే వుండదు.

పోలి__అన్నా! గట్టిచిక్కే వొచ్చిందే. బావా, నువ్వుకూడా నన్ను పోల్చుకో లేదూ?

వీరి__అడావిడి చేయకయ్యా! అదుగో జాతకం చూతాం.

(సరళ తెచ్చి యిచ్చును.)

ఎక్కడయ్యా రాశుంది?

4 దుకా__చూపనా?...ఇదుగో చూడండి-వైశాఖ శుద్ధ చవితినాడు పగలు రెండుజాములకి పాముకాటుచేత మృతి-ఇదుగో స్పష్టముగా నున్నాది. కేతు దశాంతరం అవగానే పాము కరిచి ప్రాణములు పోతాయి. (చూపును.)

వీరి__సరే. మీామాట నిజమే. అమ్మా-దీన్ని తీసుకొపో (ఆమె పోగా ఆలోచించి చూచి మీాసం త్రిప్పుచూ) నిజమే. మారకం రాశిన మాట నిజమే.

పోలి__కాని, బావా! నువ్వు నన్ను పోల్చలేదోయి? చూాడూ.

వీరి__(తల ఆడించి) ఊహు. కేసు పాడయింది.

(జగన్మోహనుడు వచ్చును)

జగ—అయ్యా! శెట్టిగారు మరణించినట్లు డాక్టరుగారి సర్టిఫికెటు కూడా వుంది. ఇదిగో చూడండి. మీ కనుమానం పోతుంది.

వీరి—ఏమిటీ? డాక్టరుగారి సర్టిఫికటూ! ఏదీ చూతాం.

జగ—అబద్ధ మనుకున్నారా? ఇదిగో—శెట్టిగారి మరణం గురించి I certify that Poli Setti is defunct. He is as dead as door nail — సంశయచ్ఛేదం అయిందా?

పోలి—అయ్యో! బాబో! ఇదేమిటీ ఘోరం?

వీరి—అయ్యా! మీ కేసు రానురాను పాడయి పోతూంది-ఇక నిల్చేటట్టు లేదండోయి.

పోలి—ఎందుచేతా?

వీరి—ఇదుగో జాతకం, అదుగో డాక్టరు సర్టిఫికటు.

3 దుకా—ఇంకా మరో నిదర్శనం వుంది. మేవందరవూఁ శెట్టిగారి శవాన్ని శ్మశానంకి తీసుకొని పోవడం చూశాము.

వీరి—మీరంతా చూశారా?

అంద—ఆహా! అందరం చూశామండి.

వీరి—[illegible]. కేసు ఏవిధంగానైనా నిలబడే టట్టు లేదు.

పోలి—బ్రతికున్న నామాట నమ్మరేం ప్రారబ్ధం, బావా!

వీరి—ఇంతైన తర్వాత పోలిశెట్టి బతికున్నా— ఆమాట నమ్మడానికి వీలులేదు.

పోలి—వీరయ్యబావా! నువ్వా నన్ను పోల్చుకో లేదోయి?

వీరి—అయ్యా! ఇంకే వఁన గలను. ప్రపంచములో అక్కడక్కడ మనిషిని పోలి మనిషి వుండడం కద్దు-కలవలవా ళ్ళుంటాచ్చు-పోలిశెట్టిగారి తండ్రికి కవలపిల్ల లున్నట్టు నిదర్శన వేఁ[illegible]దు. అతన్నెవ్వరూ అడిగి వుండలేదు. మరి ఇప్పు డడగడం అసంభవం కదా, ఏవంటే ఆత డిప్పుడు స్వర్గంలో వున్నాడు.

పోలి—నేను చెప్పుతూ ఉండగా ఇంకా నిదర్శనా లెందుకయ్యా నిప్పుల్లోకి?

వీరి—మీమాట నమ్మడ వేఁలా? మీ రెవరో ఇంకా తీర్పుకాందే-ఇదేకదా ఇప్పుడు వాదంలో పడ్డాది. ఒక వేళ మీరే పోలిశెట్టిగారని నేం చెప్తా ననుకోండి-దానికి మీరే విఁ నిదర్శనం చూపించ గలరు? మీరు చెప్పినంతమాత్రాన అది prove కాదు. పై సాక్ష్యం ఉండాలి.

పోలి—ఎటువంటి సాక్ష్యం? సాక్ష్యం ఎందుకయ్యా! మనిషంత మనిషిని మానులాగ ఎదురుగా నిలబడున్నానే- ఇంకా వేరేసాక్షు లెందుకూ?

వీరి—ఇంతమంది ఘరానా మనుష్యులు మీరు పోలి శెట్టి గారు కారంటున్నారే-మీరొక్కరే అవునంటున్నారూ

మీకు వేరే సాక్ష్యం లేదంటున్నారూ-ఇందేది నిజవో తేల డాని కేవుంది-పదుగు రాడుమాట పాటిదై ధర జెల్లు.

1 దుకా—లా సాక్ష్యంమీదేగా నిల్చేది. పదుగు రాడుమాట పాటిదై ధర జెల్లు, ఒక్క డాడుమాట యెక్క డెందూ!

2 దుకా—ఒక్క డాడుమాట ఎక్క డెందూ అన్నాడూ, చూశారా?

పోలి—మీరంతా ప్రమాణంచేసి చెప్తారా?

అంద—భేష్‌గా—మా కేం భయం—కళ్లతో చూ సిందే గా—

1 దుకా—(ఆతనిని తిరుగచూచి) ఊహూ—మీరు పోలి శెట్టి కారు.

2 దుకా—అవకీసం కూడా కారన్నమాట-దేవుఁడే సాక్షి.

3 దుకా—పోలి శెట్టి రూపే వేరయ్యా—నీది వేషం.

4 దుకా—అతని సొమ్మంతా అంకించుకుందా మని మంచిఎత్తె త్తావు కాని—

5 దుకా—నీకొక దమ్మిడీ యివ్వఁ

పోలి—దావా చేస్తాను—ఎలా గివ్వరో చూతాం.

వీరి—కోర్టులో నీ దావా పట్టేవా రెవరు?—వీళ్ళంద రూ పోలి శెట్టి దగ్గిర అప్పు పుచ్చుకున్నారు—మీరు పోలి శెట్టి కారు—ఏమంటే నిదర్శనం లేదు—సాక్షులు లేరు. ఏలా ప్రూవ్ కావడం?

పోలి—నేను నిదర్శనం చూపుతాను. సాక్ష్యం తెస్తాను.

వీరి—ఏవిఁ చూపినా, ఏవిఁ తెచ్చినా కార్యంలేదు-ఏవండీ, ఇతను పోలిశెట్టి కాడని మీరందరూ సాక్ష్యంపలుకుతారా?

అంద—నిస్సంశయంగా—అందు కాక్షేపణేవిఁ? డంకా మీా దెబ్బ కొట్టి చెప్తాం.

వీరి—ఇక ను వ్వేంచేసీ యేం లాభ వఁయ్యా?

(పోలిసెట్టి తెల్లమొగము వేయును.)

అయ్యా—నాకు కొంచం లా తెలుసును—నేనూ వకీల్నే. మీామేలు కోరి చెప్తున్నాను వినండి— ఇలాంటి పని ఎప్పుడూ చెయ్యబోకండి. చేస్తే జెలుకివెళ్ళవలసి వస్తుంది.

పోలి—అయ్యో బాబో! జైలుకే?

వీరి—ఆహా! వేషం వేసుకొని అందరినీ మోసం చేయడానికి మరొకరునిషినని వ్యవహరించడం గొప్ప నేరం-దీన్ని Imposture — false pretension — అంటారు—ఆ నేరానికి నాలుగేళ్ళు కఠినశిక్ష అని penal code లో వుంది.

పోలి—అయ్యో బాబో! నాల్గేళ్ళ శిక్ష? కఠిన వరకవేఁ?

వీరి—మిమ్మల్ని నే నెరక్కపోయినా, మీామెడల స్నేహభావం దాల్చి సలహా యిస్తున్నాను—ఎరిగెరిగి అపాయకరమైన పనిలో అడుగు పెట్టకండి—నామాట వినండి. మీా

మేలు కోరి చెప్తున్నాను, మీరు పోలిశెట్టి గారని కోర్టులో prove చెయ్యలేరు—ప్రతివాదుల పక్షం బలంగా వున్నది.

పోలి—ఎందుచేత ?

వీరి—ఇదుగో మీ జాతకం మీ కేసంతా పాడు చేసింది. జాతకం అబద్ధంఅంటారా? మీరే చెప్పండి—

పోలి—(తల యూచి) జాతకం తప్పు కాదండీ!

వీరి—అందుపైని డాక్టరు సర్టిఫికెట్టు, దాని ప్రకారం చచ్చినవాళ్ళు మరి బతకరు. బతికినవాళ్ళని అతి సులభంగా అది చంపగలదు. కనక నేను చెప్పేది వినండి— మీరు పోలిశెట్టిగారనే విషయం సందేహాస్పద మైనది. దాన్ని నిర్ధారణ చేతామంటే మీకు సాక్ష్యం లేదు. ఇక అది తీర్మానంకావడం అసంభవము.

పోలి—నీకూ సందేహ మేనా బావా ?

వీరి—మీరే ఆలోచించి చూడండి—మీకు మాత్రం సంశయం కలగడం లేదా ? ఇవతల జాతకం, అవతల డాక్టరు సర్టిఫికెటు పదియుందిఘ రానాసాక్షులు.

పోలి—డాక్టరుగారూ—నిజంగా—నేను—చచ్చిపోయినా నని వ్రాశినారా!

వీరి—మీకు సందేహ మెందుకూ? ఇదుగో చూడండి.

పోలి—(చూచి) ఔను-రాశిన మాట నిజమే! ఇంగ్లీషు నాకురాదు—వీళ్ళమాట కాదంటే ఏ మపాయం వచ్చునో?

వీరి—ఇదిగాక మీ కళ్లఎదుటనే శెట్టిగారి శవాన్ని శ్మశానానికి తీసుకోవెళ్ళారు కదా, ఇప్పుడేనా మీరు శెట్టి గారన్న మాట మీకు సందేహంగా తోచలేదా ? ఏమంటారు చెప్పండీ ?

పోలి—శవాన్ని—తీసుకొని— వెళ్ళినమాట—సత్యమే. (తల పట్టుకొని) నాతలతిరుగుతున్నది.(కన్నులుమూయును.)

అంద—అయ్యా !చూడండి—పాపం కోడై కూలింది. వీడికి మతి పోతున్నది. అన్యాయానికి ఒడిగడ్తే ప్రాయశ్చిత్తం తప్పదూ.

వీరి—అవు నవును—నేరగాళ్ళ కిలా, కావడం సహజమే. (వార్తాపత్రిక చదువుతూ నందకుమారుడు వచ్చును)

వీరి—ఏమిటీ! శెట్టిగారి మరణం పత్రికల్లో కూడా పడ్డాదీ ?

నంద—చిత్తం—ఇదుగో—వినండి...

వీరి—అచ్చు క్షరాల లోనే?

నంద—చిత్తం.

వీరి—(చూచి) అయ్యా—మీCase Hopless అయి పోయింది.

(పోలిశెట్టి కూలబడును.)

అయ్యా! మీ రీపాటి ఎవరింటికి వారు దయచెయ్యండి. నేను పోయి పోలిశెట్టిగారి ఆస్తంతా జాగ్రత్తచేసి సీళు వేయించాలి.

పోలి__సీళ్ళే? పిల్లలకి మైనార్టీ తీరలేదూ, ఎవ రాస్తిని చూస్తారు?

వీరి__ఏవీఁ! పోలిశెట్టిగారి భార్య—ఇప్పుడు నేనే ఒప్పగించుకోవాలి—నే నేమి చేయగలను? మీ రివ్వవలసిన బాకీసొమ్ముకి వడ్డీ యివ్వనక్కరలేదు, ఇదేనా సాయము.

పోలి__ఏమీ? వడ్డీ వదిలీయడవేఁ? అయ్యో (నోరు నొక్కుకొనును.)

అందరు__వీరిశెట్టిగారికి జే! వారికి భగవంతుడాయు రారోగ్య ధన కనక వస్తు వాహనము లిచ్చుగాక! (పోవుదురు)

పోలి__వడ్డీ మానడ మెందుకూ?

వీరి__వడ్డీ పుచ్చుకో నక్కరలేదు—శెట్టిగారు చాలా ధన మార్జించి వెళ్లారు స్వర్గానికి.

పోలి__స్వర్గానికి వెళ్లారూ? వీరయ్య బావా—నేను చావలేదోయి—నీతోడు! చచ్చిపోలేదు—ఇదుగో ప్రమాణం చేస్తాను, నీ నెత్తిమీద చెయ్యిపెట్టి—చూడు మరీ___

వీరి__న న్నేం చెయ్యమన్నావు? లాప్రకారం నువ్వు బ్రతికున్నట్లు నిర్ణయం కాలేదే! దృష్టాంతం లేదు—సాక్ష్యం లేదు...(వెళ్లును)

## మూ డో ర ం గ ము

——( :o: )——

(చుట్టుప్రక్కల గృహస్థులు వత్తురు.)

1 గృహ—మంచి పనైంది.

2 గృహ—పెద్దముప్పు తప్పింది.

3 గృహ—ఎంతసొమ్ము కూడబెట్టాడు ! కడుపునిండా కూడు ఎన్నడూ లేదుగదా !

4 గృహ—ఇప్పుడు ఇంకో పదిమంది హాయిగా తింటారు.

5 గృహ—పిసినారి పీనుగుల సొమ్మిలాగే పోతుంది.

పోలి—వినగా వినగా నేను బ్రతికున్నానా, లేక చచ్చానా అనే సందేహం నాకే కలుగుతున్నది. ఏవండోయి!

1 గృహ—ఏ డెవడు ?

పోలి—నేనూ...

2 గృహ—దయ్యవా? భూతవా? చెప్పవేమి ?

పోలి—పోలి...

3 గృహ—అరే—చచ్చి—

పోలి—పోలిసెట్టిని !

4 గృహ—పోలిసెట్టి చచ్చాడు—

పోలి—లేదు లేదు—ఇంకాచావలేదు. ఇక్కడుంటేనే!

5 గృహ—పోరా! పీనుగా!

పోలి—నేను పోవాలేం?—ఇది నాయిల్లు—పలుగాకుల్లారా, మీరే పొండి.

1 గృహ—వీ డెవడురా!

2 గృహ—మే మెందుకు పోతాంరా?

3 గృహ—ఎందుకు పోవాల్రా?

4 గృహ—మాటాడ వేం?

5 గృహ—చావు! పీనుగా!

పోలి—బాగుంది! బాగుంది!

1 గృహ—పిసినిగొట్టు చచ్చాడు—మంచి పనైందిరా (కూర్చుండును)

2 గృహ—ప్రజలంతా బ్రతికారురా—(కూర్చుండును)

3 గృహ—కొడుకు లిద్దర్కీ కడుపునిండా కూడు దొరికిందిరా (డిటో)

4 గృహ—కూతురు పని కీచుకీచే—(చతికిలబడును)

5 గృహ—ముసలోడ్కి నరక వేఁ గతి—(డిటో)

పోలి—(తనలో) కూలబడ్డారా? పోలిసెట్టీ! తల్లడిల్లకు! నీ బ్రతుకే తెల్లవార వచ్చింది—రక్షించుకున్నావా బ్రతికావు—లేకుంటే చచ్చావన్నమాటే—(పైకి) ఒరే క్రూరులారా? కూళ్లల్లారా! పొండి. పొండి. సరే వుండండి. సరే ఉండండి. (వెళ్లి కర్ర తెచ్చి) పోతారా, లేకుంటే ఈ కర్రతో బుర్రలు బద్దలు గొట్టనా?

1 గృహ—వహ్వా! వహ్వా! మంచి వాలకవేఁ!

పోలి—పొండి.

2 గృహ—కొడ్తావా ఏమిఁటి ?

పోలి—కొడ్తానా ; కొట్టి చూస్తానా? (కర్ర ఎత్తి) లెండి!

3 గృహ—ఏదీ కొట్టూ చూస్తావుఁ. (ఇటికలు, రాళ్లు పట్టుకొందురు)

పోలి—అయ్యో బాబో! (వెనుకకు తగ్గును.)

4 గృహ—పీనుగా! నువ్వే పో! లేకుంటే నెత్తి చితగ్గొడతాం.

పోలి—(భయపడి) వద్దు—వద్దు—నేనే పోతాను.

5 గృహ—పోకపోతే చూశావా చీపురూ?

పోలి—అయ్యోబాబో! (కొట్టితలొకదారినిపోవుదురు)

(సరళ ప్రవేశించును)

సర—అయ్యా! అయ్యా! అమ్మ ఏడుస్తూన్నది.

పోలి—ఎందు కేడుస్తున్నాదే ?

సర—ఏమో! నే నెరగను.

[తెరలో]

అయ్యో! మారాజా! వంటయింది, పొదిలేశి ఎక్కడికెళ్లావు? మారాజా! ఊఁ హుఁ హుఁ.

పోలి—బాగుంది—నా పెళ్లాం కూడా నేను చచ్చిపోయినా ననే ఏడుస్తున్నది—దీన్నెలా గూరుకో పెట్టనూ? ఓసే

పిల్లలతల్లీ! ఓసే ఇంటిదానా! నేను బతికున్నా—ఇలా రా—
ఒద్దు ఒద్దు—నేనే వస్తున్నాను—అమ్మా—పదే— (ఆమె వెళ్లును)

(పోలిసెట్టి బావమరుదులు వత్తురు)

1 బావ—పట్టుకో, పదరా, పద!

పోలి—ఇ దేమిటి?

2 బావ—కూలోళ్ని పిలవరా!

3 బావ—కూలీ! కూలీ! (వెళ్లును)

పోలి—కూలోళ్లెందుకూ? సామానంతా ఇంట్లో నుంచి బైట కీడుస్తున్నా రేమి?

2 బావ—తీసుకో పోతాం.

పోలి—ఎక్కడికి?

1 బావ—ఎక్కడికా? మరెక్కడిక? మాయింటికి!

పోలి—ఎందుకూ? నా సామాను మీయింటికి చేరుస్తున్నారేమి?

2 బావ—నీ సామానా?

పోలి—అవును—నాదికాక ఇంకెవరిది? మీదాయిది?

1 బావ—అన్నా! ఇదుగో కూలీలొచ్చారు.

(మూడవ వాడు కూలీలను తెచ్చును)

2 బావ—ఎత్తండి—ముందీ ఇనప్పెట్టె ఎత్తండి. (వారట్టుచేయబోవ)

పోలి—ఎవడా ఎత్తువాడు? (ముందుకు వచ్చును)

1 బావ—నోరుముయి! (తన్నడానికి సిద్ధపడుదురు)

పోలి—వీరయ్య బావో! వీరయ్యబావా! (పోవును)

(ఉన్నవారందరు ఒకరిని చూచి యొకరు నవ్వుకొందురు)

1 బావ—వీరిసెట్టిని తీసుకొస్తాడు కామోలును?

2 బావ—(కూలీలతో) త్వరగా ఎత్తరేవిఁ?

3 బావ—వేగం! వేగం.

(వీరిసెట్టి పోలిసెట్టియు వత్తురు.)

పోలి—వీరయ్యబావా! చూశావా యీఉపద్రవం?-

వీరి—ఏవఁయ్యా! ఈ యింట్లోని సామా నెక్కడికి పట్టుకొని పోతున్నారు?

1 బావ—పట్టుకో పోకేఁ? ఇవన్నీ మాచెల్లెలివి.

2 బావ—మాచెల్లి మాదగ్గి రుంటుంది.

3 బావ—మొగుడు పోతే యిక్కడ దాని కెవరు దిక్కు?

పోలి—చూస్తున్నావా? ఈ అన్యాయం—బావా! నేను బతికుండగానే వీళ్ళింత జబర్దస్తీ చేస్తున్నారు. నా ఆస్తీ పోయింది-పెళ్ళామూ పోయింది-ఇఖ నేనెందుకూ బతకడం?

వీరి—అయ్యా! ఆగండి. పోలిశెట్టి భార్యా ఎక్కడికీ వెళ్ళదట, ఇక్కడే వుండి తిరిగీ వివాహం చేసుకొంటుందట.

పోలి—(నోరునొక్కుకొని) అవ్ అవ్—నాపెళ్ళాం నేను చచ్చా ననుకొని ఇంకొకణ్ణి నాకళ్లెదట పెళ్ళాడుతుందా? ఎంత ఘోరం! ఏవిఁ విడ్డూరం! ఏంబావా? నాపెళ్ళాంకి మళ్ళీ పెళ్ళి చేస్తావా?

వీరి—పెళ్ళాంపోతే నేను పెళ్ళాడుతూ వుంటే మొగుడు పోతే ఆవెఁ పెళ్ళాడ కూడదూ? అదీగాక-నువ్వ పోలిసెట్టి వనడానికీ ఆవెఁ నీపెళ్ళా వఁనడానికీ సాక్ష్యం లేదే!

పోలి—సరిపోయింది-అది నా పెళ్ళాం కాకపోతే నీ పెళ్ళావాఁ?

వీరి—నన్ను పెళ్ళాడితే నాపెళ్ళావేఁ అవుతుంది. నాకు పెళ్ళాం కావాలి, ఆవెఁకి మొగుడు కావాలి... (ఇతరులతో) మీరు మీయిళ్ళకు పొండి. పోలిసెట్టిభార్యా యిష్టం-ఈ సామా నావిడ ఏంచేసుకొంటుందో-అందాకా దీనికి నేను పూచీపడతాను.

బావలు—ఇదేవిఁ టయ్యో!

వీరి—మీరు పెంకితనం చెయ్యకండి. నేనూ వకీల్ని. ముందూ వెనకా చూసి మాట్లాడండి. ఇళ్ళకి పొండి.

బావలు—మేం పోవుఁ.

వీరి—దావా చేసి మీామీా ఆస్తులు వేలం వేయిస్తాను. ఘట్టి సాక్ష్యం తెచ్చి మిమ్మల్ని మట్టిలో పాతేస్తాను-జాగ్రత్త!

బావ—బాబో! ప్లీడర్లెంతకైనా సాసులు-ఎవరెలాపోతే మనకేం పదండిరా! (పోవుదురు)

వీరి—అయ్యో! నువ్వ కూడా దయచెయి, ఈయిల్లు నాది; పోలిసెట్టి స్వర్గానికి వెళ్ళినాడు.

పోలి—అబద్దం-నేను చావలేందే! నేనే పోలిశెట్టిని.

వీరి—ఎన్నిమాట్లు చెప్పుమంటా నమ్మా?- ఇది కోర్టులో తీర్పు కావాలి—నీకు సాక్ష్యం లేదు—సాక్ష్యం తేగల్గితే ఇదివరకే తెచ్చుందువు.

పోలి—సాక్ష్యం లేకేం? నాపెళ్ళాం సాక్ష్యం పలుకుతుంది.

వీరి—అదీ మంచిమాట-నీపెళ్ళాన్ని పిలువు మరీ.

పోలి—వింటున్నావా ఈమాటలు? ఓసీ పిల్లలతల్లీ! ఇంటిదానా! ఒకమా టిలా రా! నాడబ్బా పోతున్నాది, ప్రాణం పోతూంది, ఇక బైటికి రా! (ఏడ్చుచూ సుశీల వచ్చును)

సుశీ—

దిక్కే-దిలేకుండ-మారాజా, నే-
　　నొక్కదాన్నైనాను-మారాజా
ఇల్లు పిల్లలు సొమ్ము-మారాజా, మ-
　　మ్మెవరు పోషించేరు-మారాజా
తోవేంచూపారు-మారాజా, మాకు-
　　తెన్నేంజూపారు-మారాజా
ఎవరికాడికి పోను-మారాజా, మ-
　　మ్మెవరు చూస్తారింక-మారాజా
కంటకగుపడ రేవిఁ-మారాజా, మీరు-
　　గంజైన తాగరా-మారాజా
ఎంత రొమ్మేడ్చినగాని-మారాజా, మీకు

సుంతైనదయ రాద-మారాజా
పైవోళ్ళపాదాల-మారాజా, మమ్ము-
పడుమనీ పోయూర-మారాజా!

పోలి___లేదే! పైవోళ్ళ పాదాలపైని పడవాద్దే! అయ్యో! 'ఎంచక్కని పెళ్ళాముర నాయనా-పంచదార చిలక-చెరుకుపానకం!

సుశీల___వంట చేసుకొని-ఇంట నే కూకుంటే
గంటకొస్తానని-కంటబడవేవిఁ ॥వంట॥
పప్పుపాయసము-పచ్చడూరగాయ
కుప్పతెప్పలుగాను-కూడుకూరగాయ ॥వంట॥
నీవు లేకుంటేను-నీరు నోటికిపోదు
నీవు తినకపోతే-నేను తినగలనాయీూ ॥వంట॥

పోలి___వంట చేశావా? పద ఇద్దరం తిందాం-అహాహా! భాగ్యవంతుడే నాదీ భాగ్యం-నాభార్య మహాలక్ష్మి-సందేహ వేవిఁ?

సుశీ___

కూడెవరు పెడతారు-మారాజా నాకు
గుడ్డెవరు పెడతారు ॥మా॥
నగలు చేయించవా-మారాజా నీ
నగుమోము జూపవా ॥మా॥

పోలి___ఏడవకే! ఏడవకే! ఊరుకో! ఊరుకో! (చేయి పట్టుకొనును)

సుశీ__బాబో! ఇదెవరు?

పోలి__నీ పెనివిఁటిన్నీ-పోలి శెట్టినీ! నీ భర్తను-నీ ప్రాణేశ్వరుణ్ణి-నీ నాదుణ్ణి-పోలిశెట్టినే-కొంచెం కన్నెత్తి చూడూ! అయ్యో!

సుశీ__(ముసుగు తీసి చూసి) అయ్యో! బాబో! (మూర్ఛ పోవును)

పోలి__ఇదేవిటిరా బాబూ! ఝడుసుకుందా ఏమిటి?

వీరి__ఓరీ పాజీ! ఎవడవురా? ఘరానా మనిషి భార్యాకరము బట్టినావు? పళ్ళూడగొడతాను, పో అవతలకి-

పోలి__అయ్యో! ఇది నా పెళ్ళాము బావా-నేనేం తప్పు చేయలేదు.

వీరి__ఈవెఁ నీభార్యా అంటున్నావా?

పోలి__ఔనయ్యా! నీతోడు-ఇది నా పెళ్ళావేఁ.

వీరి__నీకు మతిపోయిందా ఏవిఁ? నీ టక్కరివేషాలు సాగిరావు.

పోలి__ఈవెఁ నాభార్యా! దైవం తోడూ-దాన్నే అడుగు.

(సుశీల లేచును)

సుశీల__మారాజు లేకుంటే మరేవిఁ బతుకూ?

వీరి__పతివ్రతా! నీవు ధన్యురాలవు.

సుశీల__నేనబలనూ, సరళనూ, విహ్వలను__

వీరి__ఔ నౌనౌను!

సుశీల—దురదృష్టంచేత దుఃఖంలో మునిగి దురపిల్లు చున్నాను.

వీరి—ఓహోహో !

సుశీల—నేనొంటిగా ఎట్లుండగలను ? నాకు దిక్కెవరు ?

వీరి—సుశీలా, సువదనా, వీరిసెట్టి కంఠంలో ప్రాణాలుండ నీకు దిక్కు లేకేమి ?

పోలి—అయ్యో! అయ్యో! వీరిసెట్టీ! నా కొంప తీస్తున్నావే. నేను బతికివుండగా నాపెళ్ళానికి నువ్వా దిక్కవుతావు ?

సుశీ—నా దౌర్భాగ్యమున పతిలేని దాననైతిని. అయ్యో! ఏమి గతి? .

వీరి—నాదౌర్భాగ్యమున సతిలేని వాడనైతిని నాకేం గతి?

సుశీ—నా మనసు—

వీరి—పూర్తిగా—

పోలి—చెడిపోయుంది. అది నే నెరుగుదును. కాని—

వీరి—(సుశీలతో) ఇక నింటిలోనికి పొమ్ము. నేను పెళ్ళియత్నము చేయడానికి వెళ్లెదను. (ఆమె వెళ్ళును)

పోలి—ఒకవైపు పోలిసెట్టి దినవార్తాలూ, ఇంకో వైపు అతని భార్యా పెళ్ళిప్రయత్నాలా? అయ్యో దేవుఁడా, కలికాల విలాంటిదే.

వీరి__ఏదీ కర్ర? ఇదుగో! (కర్ర తెచ్చును)

పోలి__కర్రెందుకోయి? బావా!

వీరి__ముండాడదాన్ని చేత చిక్కించుకోనవాలి- ఆమె దగ్గిర 5000 రూపాయీల నగలు కొంత నగదూ వున్నాయి.

పోలి__ఇదిగో. నువ్వు నాచెల్లెలు పెనిమిటివి, వకీలువి, అట్టివాడవు నేను బ్రతికియుండగానే నాభార్యను పెండ్లాడతావా! బావా! అది నీకు చెల్లెలు కాదోయి! ఇంత ఘోరమా?

వీరి__ఘోరమేమి? నాబావ చనిపోయినాడు. అంతతో ఆ వావి సరి. వితంతువును పెళ్ళాడ్డానికి నా కభ్యంతరం లేదూ, ఎందుకు నే నావెను పెళ్ళాడరాదూ?

పోలి__అవ్-నా పెళ్ళాముని నువ్వు పెళ్ళాడతావా?

వీరి__నీపెళ్ళా మేమిటయ్యా! ఆమెకు పతిలేడని ఆమే చెప్పినది నీవు వినలేదూ?

పోలి__అయ్యో దేవుడా! ఇక నాకేంగతి? (ఏడ్చును)

వీరి__ఇదుగో-నిన్ను చూస్తే నాకూ ఏడ్పు వస్తూంది- నువ్వు పోలిసెట్టివే అవుదువు గాక-సాక్ష్యం లేదామె-లా ప్రకారం నువ్వు prove చెయ్యలేవు. నన్నేమి చెయ్య మన్నావు? నువ్వే చెప్పూ.

పోలి__ఏంచెప్పనూ, పెళ్ళామే పోల్చుకోలేదు. నేను-నిజంగా-చచ్చిపోయినానా? లేక బతికున్నానా? ఇది

గొప్ప సందేహం. తుపానులతో నిండిన సంసారసాగరమం దలి కెరటములలో కొట్టుకొని పోతున్నానా? లేక ఆడు కొంటున్నానా? ఉద్దండగండక శార్దూలకుంభీనసపూరితమైన ఘోరాటవుల నీరంధ్రనిబిడాంధకారంలో నున్నానా? పాట పాడుతున్నానా?—చిటిక వేసి చూస్తాను. చప్పు డవు తున్నాదే. తల ఆడించి చూస్తాను. ఆడుతున్నది—ఏమిటో? అంతా అయోమయంగా ఉన్నది. ఇది చావో బ్రతుకో తెలియదు-ఇది జీవన్మరణ పులాకము-ఏమి ప్రారబ్ధమురా దైవమా! ఇట్టి సంకటం ప్రాప్తిస్తుందని కలలోనైన తలప లేదు. ఇదిగో నాసన్నిహిత జ్ఞాతులు వస్తున్నారు-పొంచుండి వీ ళ్ళేమిచేస్తారో కనిపెడ్తాను.

(పెద్దచప్పుడు చేస్తూ వారు వత్తురు)

1 జ్ఞాతి—అయ్యో! కూర్చోండి. (కూరుచుండును.)

2 జ్ఞాతి—మనసార ఆనందిత్తాము. (,,)

3 జ్ఞాతి—ముసలాడి కిన్నాళ్ళకి కాలం చెల్లింది. (,,)

4 జ్ఞాతి—నాకు చాలా సంతోషం, పీడ వదిలింది.(,,)

5 జ్ఞాతి—పిల్లికి పిడికెడు పెట్టలేదే...ఏమి జన్మం కదా! (కూరుచుండును.)

1 జ్ఞాతి—పిసినిగొట్టుల్లో పిసినిగొట్టు.

3 జ్ఞాతి—చావన్నది లేకుండా ఉట్టి కట్టుకొని ఊగుదాం అనుకొన్నాడు సుమా?

2 జ్ఞాతి—మెట్టుకి పోలిసెట్టిని కూడా మృత్యుదేవత

మింగగలిగిం దన్న మాటే.

4 జ్ఞాతి—బాగా చెప్పావు...హాహ్హాహ్హా.

పోలి—వీళ్ళందరూ సంతోషసముద్రంలో మునిగున్నారు.

2 జ్ఞా—శని విరగడైనది.

పోలి—నాకూమతి పోతూన్నది. ఏమీతోచడంలేదు.

3 జ్ఞా—Will లో మన కేమేనాఇమ్మని రాశాడా?

పోలి—ఎవ్వరికీ రాయలేదు.

4 జ్ఞా—వెంటాచిల్లిగవ్వైనా తీసుకొని పోయడా?

పోలి—పెట్టె తీసుకో పోలేకపోయూను గాని తాళంచెవి నాదగ్గిరే ఉన్నది-ఆపెట్టె తియ్యడం మీచేతకాదు.

2 జ్ఞా—ఇంకో జన్మంలో వీడి తలబద్ద లౌతుందిరా.

పోలి—మీకు యిప్పుడే బద్దలుచెయ్యా లనుంది కాబోలు!

3 జ్ఞా—ఇంతసొత్తు గడించాడూ, ఒంటినిండా గూడ్డా? కడుపునిండా కూడా? మూశారా వాడి రాత!

పోలి—బాబో-ఇకముం దలాగు చెయ్యను. ప్రతిరోజూ షడ్రసోపేతంగా భోంచేసి వెలగల వస్త్రాలు కట్టాను. దేహీ అన్నవాడికి నోటితో కాకుండా చేత్తో లేదంటాను. బుద్ధొచ్చింది నాయనా-లెంప లేసుకుంటాను.

4 జ్ఞా—వాడిసుపుత్రులు ఆస్తిని త్వరలో కాజేస్తారులే.

పోలి—వాళ్లకి చిక్కనిస్తానా?




# రెండో అంకము

## మొదటి రంగము

---

(పోలిసెట్టి కొడుకులు వత్తురు.)

పుల్లయ్య—ఆస్తిలో సగం నాది.

సరయ్య—నీకోదమ్మిడీ చెందదు, అయ్య ఉయిల్లో అంతా నాపేర రాశాడు.

పోలి—రాశానా? ఆ? లేదే! నాకలా యాది లేదు.

పు—ఆఉయిలు సృష్టించినది, నేను సాక్ష్యం చూపిస్తాను.

స—అది చెల్లదు.

పు—నీఉయిలూ చెల్లదు.

స—నేను జాక్సన్కి వకాల్తీ యిస్తాను.

పు—నేను నార్టన్కిస్తాను.

స—నే నిందులో పదివేలైనా ఖర్చుపెడ్తాను.

పు—నేను యాభైవేలు పెడతాను.

స—నువ్వు పుండాఖోరుని.

పు—నువ్వు దగాఖోరువి.

స—నువ్వు గాదెకింద పందికొక్కువి.

పు—నువ్వు బురదలో మట్టగిడసవు.

స—నా యింట్లోనుంచి పో-

పు—నీయిల్లా! నీఅబ్బ గడించిందా? నాది కాదా?

స—పో బైటికి.

పు—నోర్మూసుకో

స—ఏదీ కర్ర.

పు—ఇదుగో కత్తి-

2 జ్ఞా—ఊరికే యెందుకయ్యా వాదించుకుంటారు? నేడు ఉత్సవం చేసుకోవలసిన రోజు-మీతండ్రి చచ్చాడు, ఇక మీరు హాయిగా ఉండొచ్చు-అడ్డుపెట్టేవారు లేరు.

3 జ్ఞా—కడుపునిండా కూడే లేదు, కాట్లాడ్డానికి శక్తి లాగొచ్చిందిరా మీకు?

4 జ్ఞా—ఒరేయి ఇటుప్రైని కడుపునిండా తిని హాయిగా ఆనందించండిరా-పోట్లాడకండి.

1 జ్ఞా—ఆడుతూ పాడుతూ కాలక్షేపం చెయ్యండి.

2 జ్ఞా—శెట్టిమీద పాట కూర్చానురా.

3 జ్ఞా—ఎప్పుడురోయి? ఏదీ పాడు-

2 జ్ఞా—ఇప్పుడే. అందరం పాడ్దాం-

చచ్చాడురా - గురుడ - చచ్చాడురా
పోలిసెటీ - నేడు - చచ్చాడురా.

పోలి—ఇం కూరుకోలేను.

అందరు—పోలిసెట్టీ - నేడు - చచ్చాడురా.

పోలి—చావలేదుర - సెట్టి - చావలేదుర మీా
ప్రాణాలు తీయుంగ - బ్రతికియున్నాడూ.

పుల్ల—ఉండుండు-ఎవడురా వీడు?

సర—ఎవడవురా నువ్వు?

పోలి—మీాకందరికీ వింతగా నుండొచ్చు-కాని పోలి సెట్టి...ఇంకా .చావలేదు, ప్రాణాలతో యిప్పుడు మీా యెదట నిలబడ్డాడనే నా నమ్మకం.

పు—ఏమిఁ టేమిఁటీ?

స— సరిగ్గా చెప్పూ?

జ్ఞాతులు—ఎవడవురా? మాపాటంతా పాడుచేశావు-నడూ ఇక్కణ్ణుంచి- ఎవడవురా?

పోలి—వీళ్లిద్దరి తండ్రినేన్నను.

జ్ఞాతులు—తండ్రివా? హీ- హి- హీ- నీమాట నమ్మడ మెలాగా? వాళ్లతండ్రివి నువ్వన్నట్టు నిదర్శనం ఏదీ?

పోలి—ప్రతిదానికీ ప్రమాణం కావాలా! అయ్యలారా!వినండి—నేను ఒకరి తండ్రినని ఎవడూ నిదర్శనం చూపలేదు- వాడి మాటే నమ్మాలి.

జ్ఞాతులు—అది మేం నమ్మం- పో పో- నువ్వు వాళ్ల తండ్రివి కావు.

పోలి—నేను ఎక్కడికి పోతాను? నాయిల్లిది.

1. జ్ఞాతి—మాకేం తెలుసు? నువ్వు పోలిసెట్టివైతే వల్లకాట్లోకి పో- అత డక్క- డుండాలి.

పోలి—అయ్యో- ఇద్దరుకొడుకులూ పోల్చుకోలేదు- మాటేనా ఆడలేదు- కలికాలప్పిల్ల లిలాంటి వాళ్లే.

జ్ఞాతు—ఏవిఁ టాలోచిస్తావు? బంగు కలిపిన పాలు తాగుతావా? కొంచెం పుచ్చుకో.

పోలి— బతికున్నవాడ్ని పాలెందు కొదలాలి? (వెళ్లుదురు).

---

రెండో రంగము

—(:o:)—

జ్ఞాతులు—ఆటకత్తెయు వత్తురు-

1 జ్ఞాతి—ఆఓ మేరీ గొహర్ జాన్-

2 జ్ఞాతి—రా- రా- కళ్లతో అద్దుకొని నెత్తిమీా దెత్తుకుంటాను.— పాట—

3 జ్ఞా—ప్రేమరసమును ముద్దచేసి- ప్రేయసీ నీకిత్తునా? నీవువలచిన వలవకున్నా-నిన్ను నే పోనిత్తునా.

పోలి—వాహ్వా- వీరంతా గీతకవు లోయి—కానీండి- మీా ప్రేమగీతాలు-

గొహ—తెల్లకలువల తేటనిగ్గుల-తీరుగల తాటాకుపై నల్లకలువల మసిని లేఖ- నల్లిబిల్లిగ వ్రాసి నే ప్రేమ॥

పోలి—తెలుపో- నలుపో- నేను పోలిసెట్టినే-

(అందరు గాహార్‌తో కూడా ఆడుతూ పాడుదురు,
పోలిసెట్టి నిషాచేత పడిపోవును.)

జ్ఞాతి___అరే-రే-జాన్- నీ పాట విని పిసినారి పీను
గైనాడు.

పోలి___(పంతుకొని) ఆరే- నోర్యామ్మాయి- నేను ధనాల
పోలిశెట్టినా? కానా?___కానూ? కాకుంటే ఎవణ్ణి? వాడి
తమ్ముణ్ణి? అన్నా, పోలిశెట్టీ! రా! వచ్చావా?

(వీరిసెట్టి పోలీసు ఇన్‌స్పెక్టరు, హెడ్‌కనిస్టేబు-
వీరిసెట్టి మిత్రులును వత్తురు.)

వీరి___ఇదుగో ఒచ్చాను-

జ్ఞాతు-- అయ్యోబాబో! పోలీసోళ్లు రోయి! పరు
గెత్తు (పోవుదురు.)

పోలి ___ (నమస్కరించి) ఇనస్పేటుగారూ! దణ్ణాలు!

వీరి___ఇదుగో పోలిసెట్టివేషం వేసుకో వచ్చినాయన
ఇతడే! తనవద్ద అప్పుచ్చుకొన్నవాళ్ల కళ్లలో దుమ్ముమేయ
డానికిలా చేశాడు.

ఇన___ఏవఁయ్యా! నీవు పోలిశెట్టివే అంటావా ఇంకా?

పోలి___అవు నండయ్యా!

ఇన___పట్టుకోండి వీడిని (అట్లు చేయుదురు).

పోలి___అయ్యా- నేనూ___

ఇన___ధనాల పోలిశెట్టివి కదా?

పోలి___(వడకుచు) అయ్యా- నేను కానండి-

ఇన—కాకపోతే అతనిలాగే వేషం వేసుకున్నా వెందుకు?

పోలి—అయ్యా—

ఇన—అబద్ధమాడక నిజము చెప్పు.

పోలి—నేనింకా మాటాడందే నామాట అబద్ధం అంటున్నారూ!

ఇన—నువ్వు చెప్పేది అబద్ధమని నే నెఱుగుదును.

పోలి—పోలీసువారూ సర్వశక్తులని, వా రేం చేయ దలచినారో అది చేయగలరని నేను విన్నాను, కాని వారు సర్వజ్ఞులని యిప్పుడు చూశాను- ప్రత్యక్షంగా.

ఇన—అయితే- దాచక నిజం చెప్పు- నువ్వెవడవు? (దుడ్డుచూపి ఝళిపించును.)

పోలి—అయ్యా! మీ రీదుడ్డు చూపించి నట్టాయినా దీని మహిమచేత మాటచెప్పవలసిన వాళ్లు నిజం మర్చి పోతారు. నా మాటా అంతే. నేనేం చెప్తే మీకు యిష్టమో చెప్పండి- అలాగే చెప్తాను- నన్ను కొట్టకండి.

ఇన—(కర్రచూపి)- "నేను ధనాల పోలిసెట్టిని కాను" అను.

పోలి—కొట్టకండి బాబూ! నేను పోలిసెట్టిని కాను.

ఇన—అలాగయితే ఎవడవు?

పోలి—అలాగయితే ఎవడవు?

ఇన— జవాబు చెప్పు-

పోలి—నేను ధనాల పోలిశెట్టి—

ఇన—తమ్ముఁడవా ?

పోలి—ఆఁ ఆఁ తమ్ముణ్ణే !

ఇన—అలాగైతే పోలిసెట్టి వేషం ఎందుకు వేశావు?

పోలి—అయ్యా—

ఇన—నిజం చెప్పు- ఇంత సరిగ్గా వేషం వేశావే!

పోలి—మేము కవల పిల్లల మండీ—

ఇన—చప్- నోరు మూసుకో—

పోలి—(నోరు మూసుకొనును).

ఇన—(వీరిసెట్టిని చూపి) ఇతడెవడు ?

పోలి—మొదట పోలిసెట్టి చెల్లెలు మొగుడు—ఇప్పుడు పోలిసెట్టి పెళ్లాం పెనిమిటి.

ఇన—ఇది నిజవేఁనా ?

పోలి—నే నెప్పుడూ అసత్య మాడనండీ !

ఇన—వీడి చెవులు నులిపి ముక్కు నేలరాయండి-

పోలి—ఇనస్పెక్టరు గారండీ ! ఎందుకండీ అలా గంటారు ?

ఇన—ఊరుకో- చెవి నులపండి.

పోలి—మీరొద్దండి నేనే నులుపు కుంటాను.

ఇన—నేను ఎన్నటికీ ధనాల పోలిశెట్టిని కాను అను-

పోలి—అంతే అయిుంది- ఇప్పుడు నే నంటేనేవిఁ ?

వీరి—Barred by limitation-లిమిటేషన్ దాటింది-

ఇన__మంచిది. చెవు లోదిలీ.

వీరి__(ఇన॥ తో) అయ్యా! లోనికి వచ్చి కొంచెం ఫలహారం చెయ్యమని నా మనవి.

పోలి__వీరయ్యబావా కాదు. తమ్ముడూ! ఇదివరకు నాకు భార్యా, ఇప్పుడు నావితంతు వైన మరదలను ఇనస్పెక్టరుగారికి చూపించు.

ఇన__నోరు మూసుకోక ఇంకా పేల్తున్నావా? (కఱ్ఱ చూపును.)

పోలి__లేదండీ, లేదండీ.

(పోలిశెట్టి తప్ప తక్కినవారు పోవుదురు.)

పోలి__చివరకి పోలీసువారి లెక్ఖ ప్రకారం నేను ధనాలపోలిశెట్టిని కానని నిశ్చయం అయింది. దెబ్బకి దెయ్యం కూడా దడుస్తుందంటే కోమటిబిడ్డ కూలబడడా?__ కాదు కాదు__నేను చచ్చానన్న మాటే నిజం. అది అబద్ధం కాదు__ఇప్పుడు తిరిగీ పుట్టానన్న మాట. ఇది నా పునర్జన్మమే! పాత పోలిసెట్టి ప్రాణాలు పోయినాయి. నేను కొత్త శెట్టిని. వాడి తీరులూ వాడి తిప్పలూ, వాడి ఊహలూ వేరు. నా తీరూ నా ఊహలూ వేరు. చచ్చిన తర్వాత నాకు జరగవలసిన తంతంతా బతికుండగానే ప్రత్యక్షమయింది. బీదవాళ్లని పొడుచుకొని తిని, ఎన్నో అబద్ధాలు, అన్యాయాలు, మోసాలు, దగాలు__ వీటి మూలంగా ఆర్జించిన ధనమంతా యిలాంటివాళ్లు తగలబెట్టడానికేనా? ఇక

చాలు- కూడబెట్టిన ధనవేఁ కుళ్లిపోతూన్నది- నేను పోలి శెట్టినని తీర్పు ఎవరేనా చేసి నాయిల్లు, నాసొమ్ము, నాపెళ్లాం పిల్లల్ని నాకిప్పించి నట్టయితే వారికిన్నీ అలాగు సాక్ష్యం ఇచ్చిన వాళ్లకీ అన్నవస్త్రాలకి లోపం లేకుండా సొమ్మిచ్చి- నేనూ నాకుటుంబమూ సామంతుల్లాగు భోగము లనుభవించే టట్లు ఏర్పాటు చేస్తాను- అలాగు నిశ్చిత వైఁనదాకా, నా సొమ్ము పరులపాలే- ఒకవేళ నేను prove చెయ్యలేకపోతే అడవుల్లోకి పోయి, పునర్జన్మం లేకుండా తపస్సు చేస్తాను.

---

## మూడో రంగము.

---

(సుశీల వీరిసెట్టితో వచ్చును).

సుశీ—ఏవిఁటాలోచిస్తున్నారు? రండి లోపలికీ—

పోలి—ఇదేవిటి? (వీరిసెట్టికి చేతులు జోడించి) మహా శయూ! నమస్కారము. (భార్యతో) ఏవిఁ సెలవు?

వీరి—పోలిసెట్టి బావా!

పోలి—పోలిసెట్టెవడు?

వీరి—నువ్వే!

పోలి—ఎవరంటారు? మీరందరూ కూడి తీర్పు చెప్పారుగా నేను పోలిశెట్టిని కానని— ఇప్పుడు మాత్రం పోలిసెట్టి నెలా గాతాను? కాజాలను- కాను- అసంభవం- సాక్ష్యం లేదే? నేను పోలిసెట్టిని కాను.

సుశీ—కోప్పడకండి- నా ప్రాణనాథులు మీరే.

పోలి—అ దేలాగూ? ఇప్పుడే కదా పోలీసువారి యెదుట ప్రమాణం చేయించి నాచేత చెప్పించి మీరందరూ తీర్పుచెప్పారు నేను సెట్టిని కానని. జాతకం ఒకటీ, డాక్టరు సర్టిఫికెటు రెండూ, న్యూస్ పేపరు మూడూ, అన్నిటికన్నా గట్టి ప్రమాణం పోలీసువారి ల్టర్- ఇన్ని విరుద్ధసాక్ష్యం యిస్తూవుంటే నన్ను ప్రాణనాథా అని పిలుస్తావే? నేను శెట్టినికాను- నా జోలికి రాకు-

సుశీ—మీరే నా ప్రాణనాథులు-

పోలి—అలాగా? నీ ప్రాతివ్రత్యంకి చాలా సంత సించాను.

సుశీ—మీ రూరికే కోప్పడుతా రెందుకూ?

పోలి—ఔను- నాకు కోపవే, నా మనసంతా చెడి పోయింది- న న్నాయాస పెట్టకు- నే నేలడివికో పోతాను-

సుశీ—అలాగై తే- మీవెంటా నేనూ వస్తాను.

పోలి—నేను యోగి నౌతాను.

సుశీ—నేను యోగిని నౌతాను.

పోలి—ఘోరమైన తపస్సుచేసి పునర్జన్మమున నాకు పెళ్లి చేసుకోవడమే అవసరం లేకుండేలాగూ, ఒకవేళ చేసుకోవలసివస్తే నిన్ను పెళ్లాడకుండేలాగున్నూ వరము కోరుకుంటాను.

సుశీ—నేనుకూడా తపస్సుచేసి మీరే నాకు భర్త

కావాలని వరం కోరుకుంటాను.

పోలి—నీకు నామీాద యిష్టం వుంటే కదా!

సుశీ—సరిపోయింది, ఇష్టం లేకపోవడ మేమిఁ?

(వీరిసెట్టి తల ఊచును).

పోలి—తల ఊచుతున్నావా? ఇంకేదో పితలాటకం నా ప్రాణంమీాదికి తేవాలని చూస్తున్నావూ? ఇదుగో-చూడు- ఇది నాపెళ్లాం- (ఆమెచేతిని పట్టుకొనును.)

వీరి—ఇదా నీబెంగ?

పోలి—బెంగా? ఇది నాపెళ్లాం కాదని సాక్ష్యం తేవాలని చూస్తున్నావా? జాతకం తియ్యా- సర్టిఫికెటు పుట్టించనా- వార్తాపత్రికల్లో ప్రచురించు నాయనా-

వీరి—సరే, నా భార్య నీ్నకిస్తాను, పుచ్చుకో.

పోలి—అబ్బబ్బ! ఏమి దయ!

వీరి—అయ్యా! బావగారూ, ఇందువల్ల మీాకేమైనా బుద్ధి వొచ్చినదా, లేదా?

పోలి—బావా, బాగా బుద్ధివచ్చింది. ఇది నాకు పునర్జన్మమే.

వీరి—అల్లాగై తే మీా భార్యాభర్తలు పిల్లల్ని పెట్టుకొని హాయిగా సుఖించండి- నాకు సెలవు—పోవును.

సమాప్తము.

---